Regd. No.
H. NL. 18
సంపుటి: 56
సంచిక: 38

# జమీన్‌రైతు

స్థాపకులు : నెల్లూరు వెంకట్రామానాయుడుగారు

సంపాదకులు : నెల్లూరు శ్రీరామమూర్తి

20-9-85
శుక్రవారం
12 పేజీలు
75 పైసలు.

# రామారావు రాజీనామాకు నాటకీయమైన ఒక పథకం?

(మా హైదరాబాదు విలేఖరి)

ముఖ్యమంత్రి శ్రీ రామారావు ప్రతిష్ఠను, తెలుగుదేశం పార్టీ పరువునూ దెబ్బతీస్తున్న పలు వివాదాలనుంచి ప్రజల దృష్టిని మళ్ళించేందుకుగాను, ముఖ్యమంత్రిచేత రాజీనామా చేయించి, తిరిగి ఉపసంహరింపజేసే తతంగాన్ని చేపట్టాలని ఆలోచిస్తున్నట్లు తెలుస్తున్నది.

ఒకేసారి వెంటాడిన తెలుగుగంగ వివాదం, కారంచేడులో హరిజనులపై ముఖ్యమంత్రి బంధువులు జరిపిన దాడి, తెలుగుదేశంపార్టీని పెద్ద సంక్షోభంలోకి నెట్టివేశాయి. ముఖ్యంగా తాను ఎంతో ఘనంగా ప్రచారం చేసిన తెలుగుగంగ ప్రాజెక్టు ఎవరూ ఊహించని విధంగా వివాదంలో కూరుకుపోవడం, ఆ ప్రాజెక్టుకు అప్పు చేయడానికి ఇచ్చిన తమ దస్త్రాలు తిరిగి వాపసు చేయాలని తమిళనాడు ప్రభుత్వం [illegible] దాంతో రామారావుకు బాగా ఇబ్బంది పెడుతున్నట్లు తెలిసింది. వాటికితోడు పదవీ విరమణ [illegible] రిటైర్డ్ ఉద్యోగుల విషయంలో సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పు. అతిక్రమం అమలు చేయకుండా తప్పించుకోడానికి చేస్తున్న ప్రయత్నాలు ఆయన పరిస్థితిని మరింత దిగజార్చాయని చెబుతున్నారు. మైనింగ్ కార్పొరేషన్‌లో అవినీతికి ప్రధానకారకుడైన [illegible] అధికారిని సస్పెండ్ చేయాలని ఎ. సి. బి., ఇతర దర్యాప్తు నివేదికల్లో సిఫార్సు చేసినప్పటికీ అతనిని తీయకుండా ఎం. డి. జి. ఎస్. రెడ్డిని సస్పెండ్ చేయాలని ముఖ్యమంత్రి ఆర్డర్ జారీ చేయడం అక్రమమని పేర్కొంటూ హైకోర్టు ఇటీవల ఆయనపై చేసిన తీవ్ర విమర్శలు కూడా అందుకు దోహదం చేస్తున్నాయని అంటున్నారు. ఈ వివాదాలను గురించి కాంగ్రెస్ (ఐ) ప్రచారం చేసి రాజకీయంగా లబ్ధిపొందకముందే వివాదాల నుంచి ప్రజల దృష్టిని మళ్ళించేందుకు రాజీనామా తతంగాన్ని గురించి తెలుగుదేశం నాయకులు తీవ్రంగా ఆలోచిస్తున్నారని అభిజ్ఞ వర్గాలవారు తెలుపుతున్నారు. ఈవిధంగా చేయటంద్వారా ప్రజలదృష్టిని మళ్ళించటమేకాక ముఖ్యమంత్రిని తిరిగి పునీతుని చేసి జాతిదృష్టిలో అనువైన విలువలున్న ప్రజాస్వామ్యవాదిగా, [illegible] వర్గాల కొంతవరకైనా [illegible] రించటం పథకం [illegible] స్తున్నది.

ఈ విషయమై గత శని ఆదివారాల్లో గండిపేటలో సమాలోచనలు జరిగాయని తెలిసింది. దాదాపు వందమంది ఎం. ఎల్. ఏ లకు ఈ విషయమై చెప్పారని తెలిసింది. అయితే ఈ విషయమై పరస్పర విరుద్ధ తర్కాలు కూడా వినబడుతున్నాయి. తనకల్లుడు చంద్రబాబును ముఖ్యమంత్రిని చేస్తే తాను దిగిపోవడానికి సిద్ధమేనని ముఖ్యమంత్రి చెప్పినట్లు ఇంటెలిజెన్స్ వర్గాలవారు వెల్లడిస్తుంటగా తెలుగుదేశం పార్టీవర్గాలవారు మాత్రం ఇది నిజంగాదని కొట్టివేస్తున్నారు. వీరైతే తేలికగా [illegible] కావాలని ఉత్సాహపడుతున్న ముఖ్యమంత్రి పీఠం, ముఖ్యమంత్రి పదవిని వదులుకోవటం అసలు అసంభవమని వారు చెబుతున్నారు. పైగా ఇప్పుడున్న పరిస్థితిలో ఎం. ఎల్. ఎ. కూడా

## ఎదురు తిరిగిన 'గంగ' ప్రభావం- కారంచేడు సంక్షోభం- రిటైర్డ్ ఉద్యోగుల సుప్రీంకోర్టు తీర్పు- మైన్స్ కార్పొరేషన్ హైకోర్టు విమర్శలు- ముఖ్యమంత్రి పరువు ప్రతిష్ఠలను దెబ్బతీశాయి!



## నాటకం కాదు- నైతిక విలువలుంటే రాజీనామే ఇవ్వాలి!

కాని శ్రీ చంద్రబాబునాయుడును ముఖ్యమంత్రి చేయటం అసంభవమని, ఒకవేళ అసంభవమే అయినా ప్రజాదృష్టిలో శ్రీ రామారావుకున్న పేరు ప్రతిష్ఠలు తరిగిపెట్టుకోలేరు ఆయన పతనం ఖాయమని వారు పేర్కొంటున్నారు. ఈ పరిస్థితుల దృష్ట్యా శ్రీ రామారావు చేత నాటకీయంగా రాజీనామా చేయించి, ప్రజల మంచి [illegible] దృష్ట్యా తిరిగి ఉపసంహరింపజేస్తున్నట్లుగా ప్రకటించే పథకమే అమలు జరుగుతున్నది. అదే సమర్థవంతమైనదని వారు అంటున్నారు.

——

# నేల కరిగిపోతూంది- కాపాడుకుందాం రండి!

ఇన్‌స్టిట్యూషన్ ఆప్ ఇంజనీర్స్ నెల్లూరు శాఖాఖ 15 తేది స్వర్గీయ మోక్షగుండం విశ్వేశ్వరయ్య జన్మ దినోత్సవాన్ని ఇంజనీర్ల పండుగగా జరిపింది. మైనర్ ఇరిగేషన్ చీప్ ఇంజనీర్ శ్రీ టి. హనుమంతరావు భూసార పరిరక్షణకు కుటుంబనియంత్రణపైనెంత కర్యక్రమం చేయాలని, అతి త్వరలో పేరుకుపోతున్న ఒక అడుగు నేల పోకుండా కాపాడుకోవాలన్నామని హెచ్చరించారు. ఇతర కాలుష్యాలు నివారించుకోగలం కాని, ఒకసారి పోగొట్టుకున్న భూమి పొరను మళ్ళీ తిరిగి తెచ్చుకోలేమని ఆయన అన్నారు.

## నెల్లూరు సంగతులు

తెలుగు గంగ సూపరింటెండెంట్ ఇంజనీరు శ్రీ కె. కృష్ణమూర్తి ఈ సభకు అధ్యక్షత వహించారు. విశ్వేశ్వరయ్య జీవిత చరిత్రను ఆయన వివరించారు.

ఈ సందర్భంగా జవహర్ భారతిలో విద్యార్థులకు పోటీలు జరిగాయి. ఎం. ఎల్. ఎన్. ప్రసాద్ (స్వామీదాస స్కూలు), బి. సత్య మురళీధర్, ఎన్. ఉపేంద్ర, పి. రాజేష్ (విశ్వభారతి) లు గెలుపొందారు. చీఫ్ ఇంజనీర్ వంద్యా కార్యదర్శి శ్రీ బి. మల్లికార్జున వందనాలు చెప్పారు.

### వైశ్యాబ్యాంకు మేనేజరుకు అవార్డు

నెల్లూరుకు కొత్తగా ఏర్పాటు చేసే బ్యాంకు వచ్చినా, తిరిగి చేరాగా ఏకోఒక అవార్డు పొందింది, నెల్లూరు పేరు తెచ్చుకున్నారు. ఆ సంధ్య రాష్ట్రస్థాయిలో వరుసగా రెండుసార్లు ఇండియన్ బ్యాంక్ మేనేజర్ శ్రీ ఎన్. ఎన్. ఎన్ శర్మ అవార్డులందుకున్నారు. ఇప్పుడు వైశ్యా బ్యాంకు మేనేజర్ శ్రీ పి. సాంబశివరావు ప్రాధాన్యతా రంగాల మంజూరులో దేశ విశేష ప్రథమస్థానం సంపాదించి ప్రశంస నీయమైన గౌరవం పొందారు.

ఈ అవార్డు బహూకరణ మహోత్సవం 15 తేది సాయంత్రం పాండురంగ అన్నదాన సమాజంలో నెల్లూరు వైశ్య జనసందోహంగా జరిగింది. బ్యాంకు జాయింట్ జనరల్ మేనేజర్ శ్రీ వి. రాజగోపాల్ షీల్డు అందజేశారు. జిల్లా జడ్జి శ్రీ శివసాంబమూర్తి అధ్యక్షత వహించారు. ఎస్.పి. శ్రీ ఆర్. గిరీష్‌కుమార్, బ్యాంకు డివిజనల్ మేనేజర్ శ్రీ టి. పి. రాజగోపాల్, జి.ప. చైర్మన్ డాక్టర్ కాంచెన్నయ్య తదితరులు పాల్గొన్నారు.

### గూడూరు యువతికి యువ శాస్త్రవేత్త అవార్డు

గూడూరుకు చెందిన కుమారి బి. మహేశ్వరి అనే యువతి, రాష్ట్ర సైన్స్ అకాడమీ ఏటా ఇచ్చే ప్రతిభావంతులైన యువశాస్త్రవేత్త అవార్డు సంపాదించారు. చాలా ప్రతిష్ఠాకరమైన అరుదైన గౌరవం ఇది. గణితశాస్త్రంలో ఆమె చేసిన పరిశోధనాత్మక కృషికి లభించిన గుర్తింపు ఇది. ఆమె ప్రస్తుతం తిరుపతి, పద్మావతి మహిళా విశ్వవిద్యాలయంలో మాథమేటిక్స్ లెక్చరర్‌గా పని చేస్తూంది.



నిన్న (19 తేది) సాయంత్రం. హైదరాబాదులో గవర్నర్ డాక్టర్ శంకర దయాళ్ శర్మ చేతులమీదుగా ఆమె అవార్డు అందుకున్నారు.

### రాఘవన్‌కు సన్మానం

వి. ఆర్. కాలేజిలో ఉత్తమ లెక్చరర్ల ఎవరనే ప్రశ్న ఉత్పన్నమైనప్పుడు మొదటగా జ్ఞప్తికొచ్చే పేరు-డాక్టర్ వి.వి. రాఘవన్‌గారిదే. పిజిక్స్ శాఖాధిపతిగా ఆయనకు తోటి లెక్చరర్లలోను, విద్యార్థులలోను ఎ.తో మంచిపేరు, గౌరవాభిమానాలున్నాయి.

రాఘవన్‌గారు ఇటీవలే రిటైరైనారు. ఈ సందర్భంగా 18 తేది సాయంత్రం కాలేజి లెక్చరర్లు ఆయన్ను ఘనంగా సత్కరించి, వీడ్కోలు చెప్పారు. అంతకు క్రితమే, ఆయన సన్నిహిత బంధువులు రాఘవన్‌గారి షష్టిపూర్తిని అత్యద్భుతంగా నిర్వహించారు.

### జపాన్‌కు నెల్లూరు క్రీడాకారుడు

నెల్లూరు యువక్రీడాకారులు దేశంలో వాలీబాల్ ఆటలో అత్యంత ప్రావీణ్యం సంపాదించి నెల్లూరికే కాక, దేశానికే కీర్తిప్రతిష్ఠలు తెస్తున్నారు: నెల్లూరు తాలూకా ఇస్కపాళెంకు చెందిన కొండేటి వెంకటసుబ్బారెడ్డి (21) అనే యువ క్రీడాకారుడు ఇటీవలం భారతదేశం తరపున కప్పు, జపాన్ తదితర దేశాలలో వాలీబాల్ పోటీలలో పాల్గొన్నారు.



ఈ యువ క్రీడాకారుడు పీఆర్ ఎన్ సైన్స్ ఆర్ట్స్ కాలేజిలో బి.కాం చదువుతున్నారు. ఆంధ్ర యూనివర్సిటీ వాలీబాల్ జట్టుకు రెప్రజెంట్ భారత వాలీబాల్ జట్టులో సభ్యుడు. గత ఏడాది మాస్కోలో జరిగిన ప్రపంచ

—కొనసాగింపు 10 వ పేజీలో



# గురుపూజ

స్వర్గీయ సర్వేపల్లి రాధాకృష్ణన్ జయంతి సందర్భంగా 5 తేది జిల్లాలో పలుచోట్ల గురుపూజలు జరిగాయి.

నెల్లూరులో డి.ఇ.ఓ. శ్రీ వై. మస్తాన్‌రెడ్డి అధ్వర్యంలో కస్తూరిబా కళాక్షేత్రంలో పెద్దసభ జరిగింది. కలెక్టర్ శ్రీ జస్బీర్ హాబేజా, జిల్లాజడ్జి శ్రీ శివసాంబమూర్తి తదితరులు పాల్గొన్నారు. జి.ప. చైర్మన్ డాక్టర్ కాంచెన్నయ్య సభకు అధ్యక్షత వహించారు.

### సైదాపురం

సైదాపురం హైస్కూలు హెడ్మాస్టరు శ్రీ పి. నాగేశ్వరరావు టీచర్లనీత పూరేగింపు జరిపి, పిల్లలకు పోటీ నిర్వహించి గురుపూజను ఘనంగా చేశారు.

### సంగం హైస్కూలు

సంగం హైస్కూలులో రిటైర్డ్ టీచర్లకు సన్మానాలు బహిరంగసభ జరిగాయి. హెడ్మాస్టరు శ్రీ ఎం. వెంకటేశ్వరరావు అధ్యక్షత వహించారు, శ్రీయుతులు ఎ. హనుమంతరావు, వి. రాఘవయ్య, జి. మస్తానయ్య తదితరులు మాట్లాడారు. రిటైర్డ్ టీచర్ శ్రీ వై. కె. కృష్ణమాచార్యులను సత్కరించారు.

### జనమడుగు కాలేజి

జనమడుగు జూనియర్ కాలేజిలో గురుపూజ. విద్యార్థి సంఘం ప్రారంభంలో సభ కలిసికోయి బాగా సాగాయి. ప్రిన్సిపాల్ శ్రీ కె. నారాయణ రెడ్డి విద్యార్థి సంఘం ప్రారంభించారు; జిల్లా పైలట్ పరిషత్ ప్రెసిడెంట్ శ్రీ గురవయ్య మాట్లాడారు. శ్రీ పోలా శిహమన జానకిరామశర్మగారికి గురుపూజ చేశారు.

—కొనసాగింపు 10 వ పేజీలో

### మాస్టార్లూ... మీకూ... ఇ.టి అడ్వాన్సు?

ఆలిండియా రేడియో
ఓ సందర్భవశంలో
ప్రకటించింది పీపులవింకుగా
మాస్టార్లకూ.... ఇంటి అడ్వాన్సు
ఏగూడూ లేని బతివంతుల్లకు,
ఏవీనాలేని గురువర్యులకు,
ఏవేవో పూహలు.... కోరికలు,
అసేవారికి పెద్ద రిలీఫులు.
ఆదర్శం జలివందనీయమన్నారు
ట్రాన్స్‌ఫరాస్తే మరోటీచరుకు
గూడన్నారు
ఎవరేమంటే ఏంలాభం
రామయ్య బుర్రలో ఏముందో ఏమో?

—వి. ఆదిశేషయ్య

# శివారెడ్డి పద్యాలు

### పసుపు గుడ్డలు

పసుపుగుడ్డలంట పరిచె కళాశాల్లో
ఉంకమీద దబ్బురిస్తున్నారు,
ఎన్టీరామారావుగారి ఏర్పాట్లు వగురాట్లు
పిస్తోల్లు అక్కడ ఎన్నాళ్లు

గద్దరిపై తిమకంటూకు కాకపుడు
బియ్యమిస్తైనా వీకపాఠ
నెత్తు ఎన్ని ఇల్లు పీకి యూనెయూడి
ఓట్లుమాత్రం నెం ప్రశ్న విషయం!

రోజ్లామారినాయి రాజకీయాల్లో
కంగురోవతులతో రాష్ట్రపోట్లు
పదవికోసకు తాము వరుసాట్ల
జాపుంటే
నాటుకు పీకి నెతెనవ్వేగుండి!

కలిసి అడుగైయి కాంగ్రెసు పరిపోతె
ఎక్కినారుతాము యెగిరి గద్దె
ఏమిద్దొ రేపు స్థిరామారావు!
తమ్మినెంటుగావు పదవులేవి!

ఎంతకాలమైనదో ఏనాడుబట్టిందో
కొంగిరేను యింతకాలమునకు
తెలుగునాట దెబ్బతిండి చిన్నాభిన్న
మైంది నాయకులకు అప్రతిష్ఠ!

ఎన్నికూడ ! తాము ఏనాడ యెక్కారో
గద్దె, యెదబట్న గలభ రచ్చ
రక్తపాతమైంది రాజ్యమ్ము, యీలవ్వు
పీటిగదు పెచ్చుగదనేప

బహుకాలం గరంపె అపేక్షలేనేం
ద్వేషబుద్ధి తెల్గుదేశమన్న
బుద్ధికోచినంత బురుపేచే తిన్నంత
తెలియనచ్చినంత తెలిప కొంత

### గుంద్ర, బెజవాడ

తివ్వబోసినాడు తివకొచ్చి వలావి
కువ్వబోసినాడు కోడిగ్రుడ్లు
పెట్టబోకలందు బెజవాడ మన గుంద్ర
ఒకరిపైన వాకరి కాదురోత!

ముట్టుకోమనేదు మూచ్చూ జేమూచ్చూట్టు
కాకబోము నీకు తగని అంటు
ప్రతిదినమ్ము కన్నె వారాదికొకరోజు
కదనదాటినయట కాల బెట్టు!

చిలకా గోతంకలంకె
అలది సుగంధమ్ముబోల్కి అన్యోన్యంబై
వెలియుత మీదాలపత్యము
కలకాలము ముద్దుగుమ్మ కామాక్షమ్మ!

### గుర్రం వెంకట సుబ్రహ్మణ్యం

సాటిలేనిమేటి సాహిత్యరంగాల
అద్వొకేటు మరవి అరిగెనిపిక
వెంకటసుబ్రహ్మణ్యం వేంచేసె వైకుంఠ
ధామమునకు, విధివి దాటగడు!

# నెల్లూరు సంగతులు

(8 వ పేజీ తరువాయి)

క్రీడామహోత్సవం, మొన్న ఆగస్టు 24 నుండి సెప్టెంబరు 6 తేది వరకు దక్షిణ కొరియాలోని సియోల్ నగరంలో జరిగిన ప్రపంచ వాలీబాల్ పోటీలకు హాజరైనాడట. ఈ పోటీలలో 144 దేశాలు పాల్గొన్నాయి; మనదేశానికి 11 స్థానం వచ్చింది ఈ యువకుడి ప్రతిభను గమనించి, రాష్ట్ర స్పోర్ట్సు కౌన్సిల్ అతనికి ప్రత్యేక శిక్షణ ఇవ్వనున్నది

### గుర్రం సుబ్రహ్మణ్యం సంతాపసభ

సాహితీవేత్త, బహుభాషా కోవిదుడు, న్యాయశాస్త్ర పండితుడు శ్రీ గుర్రం సుబ్రహ్మణ్యంగారికి నెల్లూరులోని సాహిత్య సాంస్కృతిక సంస్థలన్నీ శ్రద్ధాంజలి ఘటించాయి, వలువంపూల సంయుక్త ఆధ్వర్యాన 16 తేది టౌనుహాల్ రీడింగురూములో ఒక సంతాపసభ జరిగింది, డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షించారు. సుబ్రహ్మణ్యంగారు మేధావేకాదు, సాధుపురుషుడు, సత్పురుషుడు; ఎంత పరాకువరో అంత అదునా తనుడు; శాకిదాను కవకాలిన్నింటినీ తెలుగులో అనువదించిన కవి పండితుడు ఆయనొక్కరే; ఆయనకు నెల్లూరెంతో రుణపడివుంది అన్నారు గోపాలరెడ్డిగారు

న్యాయవాది శ్రీ ఎన్.వి.కనకరెడ్డిగారి ప్రసంగం ఐదిరిచి చెప్పదగిన కోశాగారం వలె వుండింది సుబ్రహ్మణ్యంగారి న్యాయశాస్త్ర పాండిత్యం అపారం. న్యాయవాదులేకాక న్యాయమూర్తులు కూడా తమ సందేహాలను ఆయనద్వారా నివృత్తి చేసుకునేవారు; ఆయనలేనిలోటు నెల్లూరు న్యాయవాద రంగంలో ఎవరూ పూడ్చలేనిది అన్నారు శ్రీ కనకరెడ్డి.

శ్రీ పోలూరిహనుమజ్జానకీరామశర్మ, ప్రయాగ వెంకటరావు, వైద్యుల శ్రీనివాసరావు ప్రభృతులు సుబ్రహ్మణ్యంగారి సాహితీసేవలను స్మరించి, ప్రస్తుతించారు. వేద సంస్కృత కళాశాల ప్రిన్సిపల్ శ్రీ రామానుజాచార్యులు శ్లోకంతో, శ్రీ నరసింహం పద్యంతో శ్రద్ధాంజలి ఘటించారు.

తౌంక వర్తమాన సమాజ కార్యదర్శి శ్రీ ఆగస్త్యరెడ్డి వెంకురెడ్డి సంతాప తీర్మానం ప్రవేశపెట్టారు; సభ రెండు నిముషాలు మౌనం పాటించింది,

### స్టేషనెందుకురాదు?

నెల్లూరులో
ఊకంతాచుట్టివస్తే
టౌనుబస్సు ఊర్లోవున్న
స్టేషనుకురాదు; మోపెడంత
లగేజితో మెయిన్ రోడ్డు
చేరాలంటే
ఉసూరుమంటుంది ప్రాణం
రాత్రుళ్ళు చేరిక
రైలు ప్రయాణం

—జి ఆర్, సేవకొమ్మ.

### పినాకినీతీరం

(2వ పేజీ తరువాయి)

ఆయన రావడం అలస్యమైతే ఇప్పటికే ఐదుగంటలసేపు కంకణధారులకోనే పెళ్ళిపీటలమీద కూర్చొన్నది వ్యయంగా ఆయన శిష్యులు పొందినవత్యాకనె కలకలం రేగింది. ఆయన జన్మ ధన్యమైంది తమ్మి ఆదరకలకం ఇకముందు రొమ్ముపిండుకొని తిరగ వద్దు! ముఖ్యమంత్రి తీసిన తవ్వకు వ్న వలుకుబడి బహిరంగంగా వర్రిదర్శకమై కోయింటికాలి ఇక పీకవిహారంచేసివా

ఎవ్వరూ ప్రేరేపించలేదు!

అకస్మాత్తుగా ఉద్యోగాలు పూడ వెళ్ళి. ప్రభుత్వోద్యోగుల వారి భార్యబిడ్డల కష్టసుగాధిలను రామారావు గారు వారికి తిరుగా ఉద్యోగాలివ్వడం సింధవి, లేకుంటే వారు పనిచేసినంత కాలంలో పూర్తిగా పరిహారం చెల్లించడం పొరవి తీర్పు చెప్తే పేదల అకలి మంటలు అంటూ సినిమా తంతెలేవాడు. అటువంటి దీనజనబాంధవుడు ఒకవక్తి పెళ్ళిగోలకు ఢిల్లీనుండి నెల్లూరికి ఎవరి అనుకోవచ్చాడు? అక్కడవర్పాటైన టీకి ఎవరి డబ్బు ఖర్చుఅయింది? పేదలఆకలి ఈ ఖర్చులో ప్రతిబింబిరం కాదా? పేదల ఆకలితెలిసిన ముఖ్యమంత్రికి ప్రభుత్వోద్యోగుల కడుపుమంట కనిపించలేదా? అసలు పేదరికమంటే ఏమిటో, ఆకలంటే ఏమిటో ఈ కోటీశ్వరుడికి తెలుసా? పేదల పాట్లనుగూర్చి మాట్లాడ డానికి ఆతనికి హక్కుందా?

తెలుగు ప్రజలు ఇంత నోరుచచ్చిన వర్గమ్ములై పోయారేమిటి?

### రిజర్వాయరు

(4 వ పేజీ తరువాయి)

ఉన్నాడని గట్టిగానే వినబడుతున్నది. తహసిల్దారు గిహసిల్దారు లేదు; అంతా బహిరంగ బేరమే నంటున్నారు. చెల్లాపైరలు అందోళనకర పరిస్థితుల్లో వుండగా రిజర్వాయరు ఎఇ ఇంత జరిగిపోతుంటే ఏమనుకోవాలి? అతను ఎవరి అండచూసుకొని ఇంత నిర్భయంగా వ్యవహరించాడనుకోవాలి? అతనికి పెద్ద అండే వుందట!

అసలు ఆ అసిస్టెంటు ఇంజనీరు వ్యవహారం కోవూరట. ఇరిగేషను శాఖలో గజిటెడ్ ర్యాంకు వున్న అసిస్టెంటు ఇంజనీర్లను వ్యవసాయశాఖలో వేయడమే నిబంధనలకు విరుద్ధం! అందులో వ్యవహారంలో వేయడం మరీ ఘోరం కోవూరులు పాడుదల కలిగిన రిజర్వాయరు క్రిందనే జరగాలి అటువంటప్పుడు రిజర్వాయరు క్రింద రైతులు రిజర్వాయరు అధికారిగా నియమించడం ఎంత పెద్ద పలుకుబడితో జరిగి వుండాలో వూహించుకోవచ్చు.

కలిగిరి రిజర్వాయరు సీటి అమ్మకం విషయం తహసిల్దారుగా దర్యాప్తు జరగాలి; బహిరంగంగా వచ్చి తమకు తాముగా చెప్పేవారెవరూ వుండరు. జిల్లాలోవున్న దుర్భర పరిస్థితిలో మానవతను గాలికి వదలి ఇంత పీడమాలిన తనానికి, పాల్పడిన అధికార్లమీద కలెక్టరు గారు ఆంటికరప్షను వారిచేత దర్యాప్తు జరిపించడం బాగుంటుంది. —మా. వి

### సమీక్ష

(మధ్య పేజీ తరువాయి)

ఇదీ ఐక్యతకు మనకు చూపించింది,

అయితే ఇందులో అతనేమి చెప్ప దలచుకున్నది స్పష్టంగా అర్థంకాదు; సాంప్రదాయాలంటే పంస్కృతం గాక్రదే; ఆంతమాత్రాన సంస్కృతం కల్గినవారందరూ బాంధవ్యాలకు దాములుకావాలా? అసలు సాంప్రదాయమంటే ఏమిటి? సంస్కృతమంటేఏమిటి? ఈరెండింటికిసామ్యమేమిటి? సంస్కృతం కల్గినవారందరూ సాంప్రదాయాలను అనుసరించాలా? అనుసరించని వారు సంస్కృతరహితులా?

భక్తురాలు భాండవర్రాజం పై యువతి

ప్రకటించినట్లుంటే, అది తొలగిపోవాలని ఆ ట్రస్టు తీర్మానించి ఉంటే బాగుండేది. ఆ ప్రయత్నంచేయలేదు దర్శకుడు. అంతరార్థంగా అది మంచిదనేభావం స్ఫురింప జేశాడు. గుల విద్యాత్యేకు మద్దతుగా వుంది. ఈ చిత్రంలో ఈ అనవసర వివాదం.

### గురు పూజ

(8వ పేజీ తరువాయి)

#### ఇప్పపల్లె సన్మానం

గురుపూజరోజు ఇప్పపల్లె హైస్కూలు టీచర్లు ఉపవిద్యాశాఖాధికారి శ్రీ పి. వీరాంజనేయులును సత్కరించారు. హెడ్మాస్టరు శ్రీ పి. సుందర రామమూర్తి, తెలుగుపండితుడు శ్రీ డి. వెంకటసుబ్బయ్య, అల్లూరు జూనియర్ కాలేజి సంస్కృత లెక్చరర్ శ్రీ పి. రామమోహనరెడ్డి మాట్లాడారు. శ్రీ వి. వెంకయ్య వందనాలు చెప్పారు.

### పంచాంగం

#### హస్తకార్తె

28-9-85 తేది గురువారం రాత్రి 1-02 గంటలకు హస్తకార్తె ప్రవేశం.

#### ధరలు

ఈ భాద్రపదమాసంలో మంగళవారం సంక్రమణమగుటచే అన్ని వస్తువుల ధరలు పెరుగగలవు

#### సెప్టెంబరు తిథులు

21 శని సప్తమి ప 9.18 గం. వ.
22 ఆది అష్టమి ఉ 7-05 గం. వ.
నవమి తె 5-08 గం. వ.
23 సోమ దశమి రా 3-48 గం. వ.
24 మంగళ ఏకాదశి రా 2-48 గం. వ.
25 బుధ ద్వాదశి రా 2-12 గం. వ.
26 గురు త్రయోదశి రా 2-08 గం. వ.
27 శుక్ర చతుర్దశి రా 2-40 గం. వ.

—నిమ్మగడ్డవేంకటేశ్వరశాస్త్రి




జమీన్‌రైతు చందా
సంవత్సరం చందా 40-00
ఆరునెలలకు .. 20-00

# స్మృత్యంజలి

మా వంశ దీపం మా ప్రత్యక్షదైవం మా అభ్యున్నతికి ఆలవాలం నిరంతరం

మమ్ము తన హృదయంలో దాచుకున్న అనురాగమూర్తి

జననం :

7 3-1907



అస్తమయం :

25 9-1982

## శ్రీ కూకటి కోదండరామరెడ్డిగారి

తృతీయ వర్ధంతి 25-9-1985

భగవంతుని సన్నిధిలో ఆయన ఆత్మకు చిరశాంతి కల్గాలని ప్రార్థిస్తున్నాము.

కుటుంబ సభ్యులు

Edited, Printed & Published by N. Sree Ramamurthy, Printed at The Zamin Ryot Press, Thipparajuvari Street, Nellore (A. P.)